# సద్గురు కరుణ

ఆచార్య శ్రీ ఓంకారానంద బ్రహ్మచారి.

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన ఆ పరమేశ్వరుడు సమస్త మానవాళిని అనుగ్రహించుటకై తానే సద్గురు రూపము తాల్చి భువిన అవతరిస్తాడు. అవతరించి జనులను సన్మార్గవర్తనులుగా ప్రభావితం చేస్తాడు.

జననమరణప్రవాహారూపసంసారకార్యాలచే నిరంతరం వంచితుడై తీవ్రమనోవ్యథకు మానవుడు గురి అవుతున్నాడు. పుత్ర – దార– విత్తాది విషయములనే శాశ్వతముగా తలచి వాటికై శ్రేష్ఠమైన మానవజన్మను బలిగొంటున్నాడు. దృశ్యమాన ప్రపంచ విషయాసక్తుడై తనను తాను మరచి మాయా కార్యాలచే అనాదిగా వంచింపబడుతూ, జన్మకు హేతువైన అనేక కృత్యములను చేస్తూ, సుఖమును పొందుతున్నట్లుగా భావన కలిగి, ప్రపంచమే సత్యమనే భ్రమలో విహరిస్తూ, తన పుట్టుకకు కారణమైన ఆ సర్వేశ్వరుని మరచి మెలుగుతున్న మానవుని అజ్ఞానభావ పరిధులను ఏమని వర్ణించగలము.

తనను శరీరముగా, ప్రపంచమును సత్యముగా భావిస్తున్న మానవాళికి సద్గురు యొక్క ఆవశ్యకత ఎంతగానో ఉంది. ప్రపంచవిషయములయందు ఆసక్తిని తొలగించుకొని, ఆ నిరలాక్షుని పొందగోరే ముముక్షువులకు సహితము సద్గురు యొక్క కరుణ అనివార్యము. ప్రపంచమనోధర్మాలకంటే విలక్షణుడవు నీవని ఆ సద్గురువు ముక్తకంఠంతో చెప్తాడు. ముముక్షువు యొక్క మనస్సును ప్రపంచ విషయాలనుండి మరలించి, భగవంతుని పాదపద్మములయందు లగ్నమయేటట్టుగా సద్గురువు చేస్తాడు.

**ఒక సద్గురువు నిజంగా అవసరమా?** ఈ ప్రశ్నను చాలామంది అడుగుతూ ఉంటారు. అయితే వారు తమ పిల్లల్ని పాఠాశాలకో, కళాశాలకో పంపేటప్పుడు గానీ, ఒక సంగీత గురుకులానికి పంపేటప్పుడుగానీ ఈ ప్రశ్న అడగరు! వారు తమ ఆధ్యాత్మిక జీవితాన్ని గురించి ఆలోచించినప్పుడే ఈ ప్రశ్న వారి మనస్సులో ఉదయిస్తుంది. దీనికి సమాధానం సద్గురువు అవసరమే అని చెప్పాలి. సద్గురుయొక్క ఆవశ్యకత లేకుండా ఎవరు ఉన్నతిని పొందలేరు. సమస్త వేదపారంగతుడైన నారదుడు సహితం సనకాదులను ఆశ్రయించి తత్త్వాన్ని తెలుసుకున్నాడు. **"ఆత్మవిద్య"** సద్గురు కరుణ ద్వారనే పొందవలసి ఉంటుంది.

**మరి సద్గురువు అనగా? "వేదవిదుడూ, పాపరహితుడూ, కామనారహితుడూ, బ్రహ్మనిష్ఠుడూ, పరమశాంతుడూ, కరుణాసముద్రుడూ, ఆశ్రితరక్షకుడూ, భేదరహితుడూ అయినవాడే సద్గురు".** ఇట్టి లక్షణయుక్త సద్గురువును సాధకులు ఆశ్రయించి, వారి ద్వారా "ఆత్మవిద్యను" పొందవలెను. సద్గురువు యొక్క కరుణ లేనిదే ఈ మూడు దుర్లభములు. అవి –

**దుర్లభో విషయ త్యాగో దుర్లభం తత్త్వదర్శనమ్।**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥**

సద్గురువు యొక్క అనుగ్రహము లేని యెడల 1) విషయత్యాగము, 2) తత్త్వదర్శనము, 3) సహజావస్థా అనునవి దుర్లభములు. అతిదుర్లభమైన వీటిని కేవలం సద్గురు కరుణాకటాక్షవీక్షణములచే మాత్రమే సాధకుడు పొందగలడు.

**1) విషయత్యాగము –** మానవుని యొక్క జన్మపరంపరలకు కారణము ప్రపంచ విషయములు. ఈ విషయములే మోక్షసాధనకు విఘ్నములు. విషయత్యాగము లేనిదే తత్త్వము పట్టుపడదు. కనుక విషయత్యాగమునకు సాధకుడు మొదటగా యత్నమొనర్చవలెను. లోకములో ఉండే సర్పాది విషయముల కంటె బలీయమైనవి కామాది విషయములు. పాము కాటుచే ఈ శరీరము మాత్రమే నశిస్తుంది. కానీ ప్రపంచ భోగవిషయ కాటుచే మళ్ళీ మళ్ళీ పుట్టక తప్పదు. కావున ప్రపంచ విషయములే మానవజన్మకు కారణమని సాధకులు గ్రహించాలి.

**విషస్య విషయాణాం చ దూరమత్యంతమాంతరమ్।**
**ఉపభుజ్య విషం హంతి విషయాస్స్మరణాదపి॥**

విషమునకు, విషయమునకు (కామాది సంకల్పములు) మధ్య బహువ్యత్యాసము గలదు. విషము పానము చేయువాడిని మాత్రమే చంపును. కానీ విషయమును స్మరించిన వెంటనే అతడిని హననము చేస్తుంది. తాత్పర్యమేమనగా కాలకూటవిషము కంటె విషయవాంఛ బలీయమైనదని అర్థం. కావున సాధకుడు కామినీకమనీయకటాక్షవిక్షణములయందు గల మాధుర్యమును విడువవలెను.

విషయత్యాగమునకు ఉపాయమేది? విషయ త్యాగమునకు ఒకే ఒక ఉపాయం ఉంది. అదే సద్గురువును ఆశ్రయించడం. సద్గురువును ఆశ్రయించిన పిదప, ఆ సద్గురువు ఆత్మతత్త్వమును నిష్కృష్టముగా బోధించుటచే మరియు వారి కరుణచే **''విషయ త్యాగము''** సులభమవుతుంది. అంతేకాకుండా సద్గురువు యందు ధ్యానాసక్తమైన చిత్తము గలవానికి విషయములు విషమువలె తోచును.

**మకరందం పిబన్ భృంగో గంధం నాపేక్షతే యథా।**
**ధ్యానాసక్తం తథా చిత్తం విషయాన్నహి కాంక్షతే॥**

మందారమకరందమాధుర్యమును గ్రోలే భృంగము (తుమ్మెద) దుర్గంధమును ఎట్లు గోరదో, అలాగే సద్గురువు యందు లేదా ఈశ్వరధ్యానాసక్తమైన చిత్తము విషయములను గోరదు.

**2) తత్త్వదర్శనము :-** తత్త్వదర్శనము అనగా ఆత్మజ్ఞానము. ఉపనిషత్తులలో ఆత్మజ్ఞానానికి ఉపయోగించే అనేక సాధనలు ప్రతిపాదించబడ్డాయి. సాధకుడు కర్మలవల్ల కలిగే స్వర్గాది సుఖములయందు విరక్తిని బూని, వైరాగ్యమును అలవరచుకోవాలి. ఆత్మజ్ఞానానికి కావలసిన నిత్యానిత్యవస్తువివేకం, ఇహాముత్రార్థఫలభోగవిరాగం, శమదమాది సాధనసంపత్తి, ముముక్షుత్వం అనే వాటిని సాధకుడు తప్పక కలిగి ఉండాలి. సాధన చతుష్టయ సంపత్తి గలవాడే ఆత్మజ్ఞానమునకు అధికారి అవుతాడు. ఇట్టి అధికారి **"తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"** అనే శ్రుతి వాక్యాననుసరించి సద్గురువును ఆశ్రయించాలి. ఆయన నుండి ఆత్మస్వరూపాన్ని గూర్చిన ఉపదేశం పొంది, తాను విన్న విషయాన్ని గూర్చి అనేకయుక్తులతో మననం చేయాలి. తద్వారా "ఆత్మజ్ఞానము" సాధకునకు దృఢపడుతుంది. చివరకు ''ఆత్మజ్ఞానము'' నుండి చలించని స్థితిని "సద్గురువు" యొక్క సంపూర్ణ కరుణచే పొంది, సాధకుడు చరితార్థుడవుతాడు. కనుక సాధకులు సద్గురువు యొక్క అనుగ్రహానికి కృషి చేయాలి.

**3) సహజావస్థ :-** సహజావస్థ అనగా సమాధి. నదులన్నీ వెళ్ళి సముద్రములో కలిసినట్లుగానే, ఇంద్రియములు అన్నీ ఆత్మలో లయము పొందుటయే సమాధి అంటారు. **"సమాధిస్థితి"** చాలా మహోన్నతమైనది. దీని కొరకే యమనియమాద్యష్టాంగములు ఏర్పడినవి. సమాధివల్ల సమస్త పాపాలు నశిస్తాయి. **"సమాధిస్థితిలో కొన్ని యుగాలు కూడా కొన్ని క్షణాలుగా మారుతాయి." సమాధిలో ఒక క్షణకాలంపాటు ఉన్నా ఆ పుణ్యం మిగతా పుణ్యాలకంటె కోటిరెట్లు అధికం.** కనుకనే లోకోద్ధారక మహాపురుషులు నిరంతరం సమాధిస్థితిలో ఉండుటకు ప్రయత్నిస్తారు. వారు నివసించే స్థలాలు పుణ్యక్షేత్రాలుగా మారుతాయి. ఇటువంటి ''సమాధిస్థితి'' శిష్యునకు సద్గురువు కరుణ లేనిదే సిద్ధించదు. కావున శిష్యుడు స్తోత్రము మొదలు సమాధిస్థితి వరకు సద్గురువును ఆశ్రయించి వారి కరుణకు పాత్రుడవ్వాలి.

శ్రీ మలయాళసద్గురుదేవా! కరుణాసింధో! అతిదుర్లభమైన విషయత్యాగము, తత్త్వదర్శనము, సమాధిని మాకు అనుగ్రహింపుము. మీ కృపాప్రసారిత దృష్టిచే మాత్రమే వీటిని మేము పొందగలము. చకోరపక్షివలె నీటికై (మీ కరుణకై) నిరీక్షిస్తున్న మాకు మీ కరుణ అనే జలబిందువును అనుగ్రహించి, మమ్ము కృతార్థులను జేయుము. గురుదేవా! దయార్ద్రహృదయుడవై ఈప్సితార్థము లొసంగుము. ఇవే మా వందనములు.



**మిత్రునికి మనయందు కోపము స్వల్పముగనే ఉండును.**